


దక్షిణదేశంలో తయారైన హిందీ చిత్రాలే చాలా కొద్ది. అందులోనూ తెలుగువారు తీసినవి లేవనే చెప్పాలి. "చండీరాణి" తెలుగు నిర్మాతలు స్వయంగా నిర్మించిన తొలి హిందీ చిత్రం. ఈ చిత్రాన్ని జూలై 20న ప్లాజా థియేటర్లో మద్రాసులోని కొందరు ప్రముఖులకు చూపారు. ఒక్క ముక్కలో ఈ చిత్రాన్ని గురించి చెప్పాలంటే సాధారణంగా విజయవంతంగా నడిచే హిందీ చిత్రాలలోఉండే మంచి లక్షణాలన్నీ ఈ "చండీరాణి"లో ఉన్నాయి. ఇందులో చక్కని పాటలున్నాయి, మంచి నటన ఉంది, ఫోటోగ్రఫీ ఉంది, సున్నితమైన హాస్యం ఉంది, వేగంగానడిచే కథ ఉంది, ద్విపాత్రాభినయముంది, "లవ్ ట్రయాంగిల్" కూడా ఉంది. ఇవి ఇలా ఉండగా ఒక ప్రసిద్ధతార—అందులోనూ హిందీ ప్రేక్షకులకు ఇదివరకే పరిచితురాలైన తార—దీనికి స్క్రిప్టురాసి, డైరెక్టరుగాకూడా పని చేసిందన్నది—ఈ చిత్రానికొక ప్రత్యేకత కాకపోదు.

వీరసింహుడనే రాజు (అమరనాథ్) తన ఇరవైఅయిదవ పుట్టినరోజున తన మంత్రినీ, సేనానినీ వెంటబెట్టుకుని మారువేషాలతో, వేడుక చేసుకుంటున్న ప్రజలను చూడబోతాడు. వారు ఒకచోట నృత్యంచేసే ఒక పిల్లను చూస్తారు. రాజూ, సేనాని ప్రచండుడు (రంగారావు) ఒకేసారి ఆమెను మోహిస్తారు. ఆమెనే పెళ్ళాడతానంటాడు రాజు. కూడదంటాడు ప్రచండుడు. కోలాహలంలో వాగ్వాదం జరిగి పథికులు రాజును బలపరుస్తారు. రాజు ఆ కన్యను వివాహమాడతాడు. కాలక్రమాన ఆమె కవలపిల్లను కంటుంది. బాలింతరాలికి విషంపెట్టి చంపిస్తాడు సేనాని. భార్య దుఃఖంతో మతిపోయిన రాజును చెరలో ఉంచుతాడు. పిల్లలనుకూడా చంపేస్తాడని తెలిసి



బొంబాయి ప్రకాశ్ పిక్చర్సువారు నిర్మిస్తున్న "శ్రీ చైతన్య మహాప్రభు"లో భరత్ భూషణ్

మంత్రి ఒకపిల్లను నాసి (హేమలత) చేతికిచ్చి రహస్యమార్గాన పంపేసి, రెండవ పిల్లతో తాను కోట దాటిపోతూ సేనానికి దొరికిపోతాడు. సేనాని మంత్రిని చంపేసి పిల్లను చేజిక్కించుకుంటాడు. మంత్రి కొడుకైన కిశోర్ (రామారావు)ను రామసింగ్ అనే సేవకుడు (దొరస్వామి) పెంచుతాడు. ప్రచండుడు రాజుగా వ్యవహరిస్తూ ఉంటాడు.

కొండలమీద చండీ, రాజసౌధంలో చంపా (భానుమతి ధరించే ఉభయపాత్రలు) పెరిగి పెద్దవారవుతారు. చండి అత్యంత సాహసిగా, చంప పంజరపు చిలుకగా తయారవుతారు.

ప్రచండుడి కొడుకు ముకుంద్ (ఆగా— తెలుగు, తమిళ చిత్రాలలో రేలంగి) చంపను ప్రేమిస్తాడు. కాని ఆమె చిరునవ్వుకూడా సంపాదించలేక పోతాడు.

ఈ స్థితిలో కిశోర్‌కు రామసింగ్ అతనితండ్రి దుర్మరణంగురించీ, సేనాని దుండగాలనుగురించీ చెబుతాడు. అతను ప్రతీకార ప్రయత్నంలో మూర్ఖుడైన ముకుంద్‌ను అవలీలగా ఓడించి రాజసౌధంలో ప్రవేశించి చంపను చూస్తాడు. వెంటనే ఇద్దరిమధ్యా ప్రణయం పుడుతుంది.

కిశోర్ చంపసోదరి చండిని అన్వేషిస్తూ బయలుదేరి ఆమెను కలుసుకుంటాడు. చండి తన కథ తెలుసుకుంటుంది. తనసోదరికి సాయపడ సిద్ధురాలవుతుంది. అన్ని ఏర్పాట్లూచేసి ఆమెను పిలిపించటానికి కిశోర్ బయలుదేరి పోతాడు.

కాని కూల్‌గా ఒక కోయదొర చండిమీది పగతో ఆమెఇల్లు తగలబెట్టేస్తాడు. ఆమెను పెంచినదాసి చనిపోతుంది. ఒంటరిగత్తె అయిన చండి రాచనగరుచేరుకుంది. మహారాణీకంటు దుమ్ముకొట్టి చంపఉన్నచోటికి చేరుతుంది. మొదటిసారిగా ఇద్దరు అక్కచెల్లెళ్లూ కలుసుకుంటారు. చంపక్షేమంకోసం చండి ఆమెతో దుస్తులు మార్చుకొని ఆమెను కిశోర్‌దగ్గిరికి పంపేస్తుంది, చండి చంపగా మారిపోయిన ఫలితం ముందుగా ముకుంద్ జీవితాన్ని తాయమారు చేస్తుంది. చంప మొదటిసారి తనను చూసి నవ్వేసరికి ఉబ్బి తబ్బిబ్బయిపోతాడు ముకుంద్. దానికి ప్రతిఫలంగా ఆతను ఆమెను జైలులోఉన్న రాజు-



ఎం. ఏ. వి. వారి "రోహిణి"లో మాధురీదేవి, సహస్రనామం.



“రోహిణి”లో వరలక్ష్మి, సహస్రనామం.

దగ్గిరకి తీసుకుపోవటానికి సమ్మతిస్తాడు. అయితే లంఖిణిలాటిదాసి ఒకతె అడ్డున్నది. ఆ దాసిని భయపెట్టటంకోసం ముకుంద్ తన భృత్యుణ్ణి పులివేషంవేసుకుని వెంటరమ్మంటాడు. అయితే దురదృష్టవశాత్తూ ముకుంద్ వెనకగా ప్రచండుడి పెంపుడుపులే స్వయంగా బయలుదేరుతుంది. ఈ పులినిచూసి తన భృత్యుడేనని ముకుంద్ అనుకోవటం కొంతదూరం హాస్యంగానే నడిచి ఆకస్మికంగా తీవ్రపరిస్థితికి దారితీస్తుంది. పులి ముకుంద్ మీద పంజా ఎత్తుతుంది. ఆపదలో తోచకని ముకుందుడు బల్లకింద దూరుతాడు. చండి ఆత్మరక్షణార్థం తనబాకుతో పులినిచంపి, ఆ గౌరవం ముకుందునే తీసుకోమంటుంది. ముకుంద్ యథాశక్తియత్నిస్తాడు గాని ఆతనియత్నం సాగదు. తనకొడుకు పులిని చంపివుండడనీ, చంపే చంపి ఉండాలనీ, చంపవంటి భీరువు పులినిఎట్లా చంపిందనీ ప్రచండుడికి సందేహం కలగసాగుతుంది. నిలవనీసి అడిగేసరికి ముకుంద్ నిజం చెప్పేస్తాడు. చంప తనకు తెలియకుండా తన కొడుకుసహాయంతో రాజును చూడ యత్నించిందని తెలుసుకుని ప్రచండుడు ఆమెను రాజును కలుసుకునే వీలుకలిగిస్తాడు. చండి తండ్రిని కలుసుకుని మాట్లాడుతుంది. కాని ప్రచండుడు ఈ సంభాషణకు భంగం కలిగించి తనకొడుకుకు ఆమెను వెంటనే వివాహం నిశ్చయిస్తాడు.

చండి ఈలోపుగా కిశోర్‌ను కలుసుకుని ఆలోచనచెయ్యటానికి బయలుదేరుతుంది. ఆ రాత్రి నిండువెన్నెలలో చంపా కిశోర్‌లు ప్రేమగీతాలు పాడుతూవుండటం చూసి తనకు కిశోర్ మీదగల ప్రేమ వృథా అని తెలుసుకుని నిరాశతో తిరిగిపోతుంది.

కిశోర్ ప్రచండుడి పతనంకోరకు యత్నాలు సాగిస్తాడు. ఈసంగతి తెలిసి కిశోర్‌ను ప్రచండుడు ఖైదుచేస్తాడు. కిశోర్ చేత ప్రేరేపితులైన ప్రజలకూ, ప్రచండుడి భటులకూ యుద్ధంజరుగుతుంది. చండి ప్రచండుడితో కత్తియుద్ధంచేసి ఆతన్ని చంపి తానూ చచ్చిపోతుంది. కిశోర్ చంపను వివాహమాడి సుఖంగా ఉంటాడు.

నటులలో భానుమతి స్వేచ్ఛావిహంగంగానూ, పంజరపుపిట్టగానూ చాలా నైపుణ్యంతో నటిం

చింది. ప్రచండునిగా రంగారావు తన నటనా సామర్థ్యం బాగానే ప్రదర్శించాడు. కిశోర్‌గా రామారావు నటన చాలా తృప్తికరంగా ఉంది. ప్రచండుడి ఉంపుడుగత్తె పాత్ర కథకు అవసరమైనా అర్థంగావటం లేదు. ఈ పాత్రను విద్యావతి బాగానే నిర్వహించింది. ముకుంద్‌గా ఆగా మంచిహాస్యం ఒప్పించాడు. దొరస్వామి, సీతాలత్, అమరనాథ్, ఆర్. నాగేశ్వరరావు (ప్రచండుడి అనుచరుడు) తదితరులు బాగా నటించారు. పిల్లలతో నృత్యం బాగుంది. దాదాపు పాటలన్నీ భానుమతే పాడింది. పాటల మట్లూ, రచనా, సంభాషణలూ తృప్తికరంగా ఉన్నాయి. డ్యూయెట్ పాటలో రామారావుకి తలత్ మహమ్మద్ పాడిన పాట చాలా శ్రావ్యంగా ఉంది.

ఈ చిత్రానికి వంక పెట్టదలిస్తే కథలో కొత్తదనం తక్కువ అనవచ్చు. బలవంతుడైన రాజోద్యోగి రాజును చెరబెట్టటమూ, కవలపిల్లలు చెరో కదానీ అయిపోయి భిన్న వాతావరణాలలో పెరగటమూ, ఇద్దరూ ఒకరినే ప్రేమించి అందులో ఒకరు చచ్చిపోయి రెండోవారికి దారి ఇవ్వటమూ—ఇదంతా పాతచింతకాయ పచ్చడే. చిత్రం ఆఖరులో మార్తాండుడు ఖైదులో కత్తుల బోను ప్రదర్శించి మరలు తిప్పటంలోకూడా నూతనత్వం ఏమీలేదు.

ఉన్న కథలో కూడా అసందర్భాలు కొన్ని ఉన్నాయి. చూలాలైన రాణినీ, ఆమెకు మందు పెట్టిన వైద్యుల్నీ, కోటదాటి పారిపోయే మంత్రినీ సునాయాసంగా ఖూనీచేసిన ప్రచండుడు రాజును ముందుగానే ఖూనీచేసి అతను పెళ్ళాడబోయిన కన్యను తానే పెళ్ళాడి ఉండవచ్చు. అతనికి కావలిసినది రాజ్యమైతే, తనకు కవలలలో చంప దొరికితేనా రాజును ఖైదులో బతికిఉండనివ్వటంలో అర్థంలేదు. చంప నవ్వుందని ముకుంద్ చెప్పాడు. ఇన్నేళ్ళూ తండ్రిని చూడగోరని చంప ఆకస్మికంగా ముకుంద్‌ను తనవలలో వేసుకుని ఇందుకుప్రయత్నించింది. ఈ యత్నంలో ఆమె పులిని చంపేటంత ధైర్యసాహసాలు ప్రకటించింది. చంపకు కవలసోదరి ఉండేదని ప్రచండుడికి తెలుసు. ఈ పరిస్థితిలో అతనికి చంప చంపకాదేమోనని సందేహం పుట్టి అది రూఢి చేసుకునేటందుకు యత్నించటానికి బదులు ప్రచండుడు తన కొడుక్కి చంపనిచ్చి పెళ్ళి చేయ నిశ్చయిస్తాడు! చంప సోదరి బతికే ఉందని అతనికి తెలిసే సమయానికి ఆ జ్ఞానం అతనికెందుకూ పనికి రాకపోతుంది.

ఇటువంటి లోపాలు లేకపోతే "చండీరాణి" చాలా ఉత్తమ తరగతికి చెందిన హిందీ చిత్రముగా గణనకు వచ్చి ఉండును. ఇప్పటికైనా ఈ చిత్రం తగినంతగా హిందీ చిత్రప్రేక్షకుల ఆదరాన్ని చూరగొంటుందనీ, భానుమతి డైరెక్షన్‌తో భరణీ సంస్థ ఇంకా మంచి హిందీచిత్రాలను తీగలుగుతుందనీ ఆశించవచ్చు. మూడు భాషలలో ఒకేసారి తయారై ఒకేసారి వెలువడుతున్న "చండీరాణి" భరణీ స్టూడియోకు శుభప్రదమైన నాంది. ఈ చిత్రం భరణీసంస్థకు నిస్సందేహంగా గొప్ప ముందడుగు. హిందీ చిత్రాలు తీయటం తప్ప గత్యంతరం లేనట్టు కనిపిస్తున్న ఈ రోజులలో మన పెద్ద చిత్రనిర్మాతలకు భరణీవారి "చండీరాణి" మంచి ఒరవడి కాగలదనటానికి సందేహం లేదు.